# Second Class

ద్వి. అడిగినఁ బ్రాణంబులయిన నొప్పింత్రు
నుడివిక్రమ్మఱఁదప్ప నుసువరుఘనులు.

అందనిఫలముల కఱ్ఱులుసాచి
వంతనొందుచుధృతి వదలంగఁదగదు.

ఆఁకలిఘనమైన నదరిసింహంబు
మేఁకలఁబూరిపుచ్చి మెసవునేమఱియు.

ఇరవొందమందుగా నింటనుగెల్చి
వరుసరచ్చనుగెల్వ వలెనువేవేగ. 4

ద్వి. ఉపకారమోపిక నొనరించువారి
కపకారమొనరించు టదిధర్మ్మవగునె.

ఉపమింపసత్కీర్తి యొకయేటరాదు
అపకీర్తికనుమూయు నంతనెవచ్చు. 6

ఎంతేసికార్యంబు లేగుదెంచినను
వంతనొందుచుధృతి వదలంగఁదగదు.

ఎసగమ్రొక్కినవార మిడునదే వేల్పు
వసుధనక్కఱదీర్చు వారెచుట్టములు.

ద్వి. కరిబోంపిఁజిక్కిన గ్రమ్మఱనెత్తఁ
గరియోవుఁగానిసూ కరమెట్టుఁబోవు.

కులముప్రధానమే గుణములేకున్నఁ
గలశాబ్ధిఁబుట్టదే కాలకూటంబు. 10

చెనటిమూర్ఖునకు సిరివచ్చెనేని
చెనఁకియెవ్వరినేమి చేయునోరేగి. 11

దండడిఢీకొని తగరుడాకినను
కొండలమందునె కులపర్వతంబు. 12

ధర్మమెయ్యెడనైనఁ దనుగాచునెడి
నిర్మలవాక్యంబు నెఱినమ్మవలయు. 13

ద్వి. పనివషిమబ్బుఁగో పలినీళ్లనమ్మి
దొనసీళ్లుదెగఁగొట్టు దురవెట్టులైన.

పలువిచ్చినగరాదు పరులయిండ్లకును
పలుమాఱుపోరాదు పనులులేకుండ.

పిన్నయైననుబుద్ధి పెద్దయావాని
మన్నింపఁదగునది మాన్యసమ్మతము.

పుట్టుభోగములన్ని పోయినవేళ
బట్టలేదనిచింత బసుటమేలగునె. 17

పొనగినబంగారు బొమ్మనుదెచ్చి
మసిపాలగట్టుట మానితంబగునె. 18

ద్వి. బిడ్డలకొసఁగక పెండ్లానికిడక
వడ్డికిచ్చుచుఁజీమ వలెగూర్పదగదు.
వదలకసన్మంత్రి వాక్యంబువినెడి
సదమలమతిరాజు సౌఖ్యంబునొందు.
సత్యంబుఁదప్పక చరియింపవలయు
నిత్యంబులనరాదు నిఖలసంపదలు.

ద్వి. వెదకఁబోయినతీఁగె విస్మయంబొదవ
పదములఁదగులుట భాగ్యంబుకాదె.
క్షితిఁగానఁదానుజేసినపాతకంబు
వెతలఁబెట్టఁగఁబోదు విప్రుఁడైన.

ఆ. వె. అంతరంగమందు నపరాధములుఁ జేసి, మంచివానివలెనె మనుజుఁడుండు
నితరులెఱుఁగకున్న నీశ్వరుండెఱుఁగఁడా, విశ్వదాభిరామ వినురవేమ. 24

క. తనవంకచుట్టములకం, టెను బెనిమిటివంకవారి నెనరగుచాదం
బునఁజూచునెలత గొనముల, గనిగాదె తలంచిచూడఁ గానెయ్యెడలన్. 25

## Third Class.

క. శ్రీమంతుఁడె కులవంతుఁడు, శ్రీమంతుఁడె సుభగరూప జితకంతుండౌ
శ్రీమంతుఁడె గుణవంతుఁడు, శ్రీమంతుఁడె సిద్ధశేముషీమంతుఁడిలన్. 1

క. ఏనరునకువిత్తముగలఁ, దానరుఁడెకులీనుఁడధికుఁ డార్యుండతఁడే
ధీనిధి ధన్యుఁడునేర్పరి, నానాగుణగణము కాంచ నమ్మునవిలుచున్. 2

క. శత్రుఁడు చదువనిపుత్రుఁడు, శత్రుఁడు ఋణకారియైన జనకుఁడుమిగులన్
శత్రువు రూపసి యగుసతి, శత్రువు దుశ్చరితయైన జననితలంపన్. 3

క. తనయొడలింగలనెత్తురు, ధనహీనుని విడిచిపోవు దారాదిసుహృ
జ్జనములు విడుచుటయరుదే, మనుపీనుఁగునిర్ధనుండు మదిఁబరికింపన్. 4

క. దానముభోగమునాశము, పూనికతోమూఁడుగతులు భువిధనమునకున్
దానముభోగమునెఱుఁగని, దీనుని ధనమునకుగతి తృతీయమెపొసఁగున్. 5

క. ఉత్తమగుణములునీచున, కెత్తెఱఁగున గలుగనేర్చు నెయ్యెడలందా
నెత్తిచ్చికరఁగిపోసిన, నిత్తడి బంగారమగునె యిలలోసుమతీ. 6

క. ఓడలబండ్లునువచ్చును, ఓడలునాబండ్లమీద నొప్పగవచ్చున్
ఓడలుబండ్లునువలెనే, వాడంబడుఁగలిమిలేమి వసుధను సుమతీ. 7

క. దయఁబోలవధ్వరంబులు, దయఁబోలవు సకలభూమి దానచయంబుల్
దయఁబోలవు జపతపములు, దయతలపోయంగశిష్ట తరధర్మమిలన్. 8

క. కూడినద్రవ్యముపాత్రుల, కాడంబరవృత్తినొసఁగ నదివృథయెయగున్
బూఁడిదలోహోమమువలెఁ, బాడింటకినిడినదీప పత్తియుఁబోలెన్. 9

గీ. తస్కరులు భూమిపతులు విత్తములుబలిమిఁ
బొదివికొనిపోవఁ జూచుచుందురుగాని
యీఁగలిగియేరికిని దగనిడఁగలేని
కష్టలోభులకేల సద్గతులుగలుగు. 10

గీ. ఎంతచదువుచదివి యేనీతివిన్నను, హీనుఁడవగుణంబు మానఁడెందు
బొగ్గుపాలఁగడుగఁ బోవునామలినంబు॥ విశ్వ॥ 11

గీ. కుక్కతోఁకఁబట్టి క్రోవిసబెట్టిన, గ్రోవిచాయనుండు గొంతవఱకు
గ్రోవితీసిచూడఁ గొడవలివలెనుండు॥ విశ్వ॥ 12

గీ. గాడిదతనువునను గంధంబుపూసిన, నేమియొఱుఁగఁజాల కెగసితన్ను
నీడుకానివాని యిష్టమీలాగురా॥ విశ్వ॥ 13

క. ధనమేమూలము జగతికి, ధనమేమూలంబుసకల ధర్మంబులకున్
గొనమే మూలముసిరులకు, మనమేమూలంబుముక్తి మహిమకువేమా. 14

గీ. నిక్కమైనమంచి నీలమొక్కటిచాలు, తళుకుబెళుకుఱాలు తట్టెఁడేల
చదువఁ బద్యమరయ, జాలదాయొక్కటి॥ విశ్వ॥ 15

గీ. నీళ్లలోనిమీను నిగిడి దూరముపాఱు, బయటమూరెఁడైనఁ బాఱలేదు
స్థానబలిమికాని, తనబల్మికాదురా॥ విశ్వ॥ 16

క. కొంచెపునరుసంగతిచే, నంచితముగఁ గీడువచ్చు నదియెట్లన్నన్
గించిత్తునల్లిగఱచిన, మంచమునకుఁ బెట్లువచ్చు మహిలోసుమతీ. 17

గీ. గొడ్డుటావుఁబిదుకఁ గుండఁగొంపోయినఁ, బాలనీకతన్ను బండ్లువిఱుగ
లోభివానినడుగ, లాభంబులేదురా॥ విశ్వ॥ 18

గీ. నిజమునాడువాఁడు నిర్మలుండై యుండు, నిజము నాడువాఁడె నీతిపరుఁడు
నిజముపల్కకున్న, నీచచండాలుండు॥ విశ్వ॥ 19

గీ. మిరపగింజచూడ మీఁదనల్లఁగనుండు, కొఱికిచూడలోనఁ జుఱుకుమనును
సజ్జనులగువారి, సారమిట్లుండురా॥ విశ్వ॥ 20

గీ. లక్ష్మిపోవునాడు లంకేశు రాజ్యంబు, నంతటఁ గపిసేన యాక్రమించె
చేటుకాలమైనఁ, జెఱుపనల్పుఁడెచాలు॥ విశ్వ॥ 21

గీ. వ్యాధికలిగెనేని వైద్యునిచేతను, మందుదినకగాని మాన దెందు
చెంతదీపమిడక, చీకటితొలఁగునా॥ విశ్వ॥ 22

గీ. పరగ ఱాతిగుండు పగులగొట్టగవచ్చు, కొండలన్నిపిండి గొట్టవచ్చు
కఠినచిత్తుమనసు, కరిగింపఁగారాదు॥ విశ్వ॥ 23

గీ. వేరుపురుగు చేరి వృక్షంబుఁ జెఱుచును, చీడపురుగు చేరి చెట్టుఁ జెఱుచు
కుత్సితుండు జేరి, గుణవంతుఁ జెఱుచురా॥ విశ్వ॥ 24

గీ. కార్యగతుల తెలుగు కలరూపు సెప్పిన, నధికమతులు దాని నాదరింతు
రల్పభాగ్యబుద్ధు లగువారలకు నది, పరుసకారణంబు విషమువోలె. 25

# Fourth Class.

క. జననీజనకులవృద్ధులఁ, దనయులగురువిప్రసాధు దారాదులనే
జనుఁడు ఘనుఁ డయ్యుఁ బ్రోవక, వసరును జీవన్మృతుండు వాఁడుధరిత్రిన్. 1

గీ. తల్లివ్రేఁగుసువ్వె ధరణికంటెను, నాక సంబుకంటెఁబొడవు జనకుఁడరయ
గాడ్పుకంటెమనసు గడుశీఘ్రగతిత్రో, తృణముకంటెఁజింత కరముదఱుచు.

క. తనయుండుదల్లిదండ్రులు, పనిచినపని సేయఁడేని పలుకేదలోఁ జే
కొనడేని వాఁడుతనయుం, డనఁబడునే పితృధనమున కర్హుండగునే. 3

క. శరణంబనివచ్చినభీ, కరశత్రునినయినఁబ్రీతిఁ గావఁగవలయున్
గరుణాపరులతెఱంగిది, యిరువుగసరిగావుదీని కేధర్మంబుల్. 4

క. జననీజనకగురులయెడ, నొనరించినమేలుఁగీడు నొదవించుసుఖం
బునకును దుఃఖమునకునిం, తనికొలఁది యిడనవశంబె యజునకునైనన్. 5

గీ. శోకశాత్రవభయముల చొప్పుమాన్పు, ప్రీతివిశ్వాసగుణహేతు భూతమైన
మిత్రమనునక్షరద్వయ మిశ్రమైన, రత్నమే వేల్పుసృజియింపఁ బ్రబలెనొక్కొ. 6

గీ. ఇనుమువిఱిగనేని యినుమాఱుముమ్మాఱు, కాచియతుకవచ్చు క్రమముతోడ
మనసువిఱిఁగెనేని మఱిచేర్పరాదయా॥ విశ్వదాభిరామ వినురవేమ॥ 7

గీ. బ్రదుకవచ్చుఁగాక బహుబాధనములైన, వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవధనములైనఁ జెడుఁగాకపడుఁగాక, మాటతిరుగలేరు మానధనులు. 8

గీ. పుట్టలిసుమంతలిడనిడఁ బొదలుటెఱిఁగి, పుడుకఁబుసుకంగఁగాటుక పోకఁజూచి
విత్తసముపార్జనవ్యయ వృత్తులందుఁ, జిత్తమిడినట్టినరునకుఁ జేటులేదు. 9

గీ. పిల్లుగట్టునలకు బేరుండుదానైన, నాయమునకు వెచ్చ మధికమైనఁ
బేదయైనధనదు పెన్నుద్దియైచను, నాయమునకు వెచ్చ మల్పమైన.

క. ఒడమిఁగలవెడఁగునైనను, బుడమింగలవారలెల్ల భూషింతురు శ్రీ
పెడఁబాసినదూషింతురు, కడుఁబేదఱికంబుకంటెఁ గష్టముగలదే

క. కొలఁదికిమీఱినలక్ష్మికి, నలరెడుభోగంబెఱుక యారసినఁగాదే
జలపూర్ణతటాకమునకు, నలవడఁగావాటమైన యలుఁగుంబోలెన్.

క. నెఱవగుసంపదగలిగిన, నెఱినానంగుడువఁగట్ట నేరనిమనుజుం
డఱిముఱిఁజేనికిఁగట్టిన, వెఱబొమ్మయకాఁడెయుక్తి విధముఁజూడన్.

గీ. తరువులతిఫలభార గురుతఁగాంచు, సంగివ్రేలుచుఁ నమృతము సంగుమేఘుఁ
డుద్ధతులుగారుబుధులుస మృద్ధిచేత, జగతినుపకర్తలకునిది సహజగుణము.

క. సేతువుదర్శింపమహా, పాతకములుఁ బాసిపోవు ప్రాణసఖునకున్
ఘాతుకమతినొనరించిన, పాతకమే తీర్థసేవఁ బాయదునరునిన్. 15

క. మిత్రద్రోహికృతఘ్నుఁడు, ధాత్రీసురహాంతహేమ తస్కరుఁడుసురా
పాత్రీభూతుఁడునిందా, పాత్రులువీరెల్లనరక భవనావాసుల్. 16

క. పరువంబుకలిమిదొరతన, మరయమియనునట్టివీని యందొకఁడొకఁడే
పొరయించునర్థమునాఁ, బరఁగినచో నాల్గుచెప్ప వలయునెచెపుమా. 17

క. పురుషుండిం[illegible]తెఱఁగుల, ధరనుత్తముఁడనఁగబరఁగుఁ దానెయ్యెడలం
బరుసములుపలుకకుండిన్, దురితంబులువొరయుపనుల దొరగుటవలనన్. 18

గీ. బలముఁగలవానిఁబలువురు బలవిహీను, లొక్కటైకూడినిర్జింతు రుత్సహించి
మధువుఁగొనునుత్సహించిన మనుజుఁబట్టి, కుట్టినిర్జించుమధుకర కులమునట్లు.

క. మనమున వైరముదలపమి,యును సద్ధర్మాత్ముఁడగుట యునుగుణములుచే
కొనిదోషంబులువిడుచుట,యును నుత్తముఁడై సపురుషు నుత్తమగుణముల్.

క. మఱచినఁదలపింపఁగనగు, నెఱుఁగనివాఁడెల్లపాట్ల నెఱిఁగింపనగున్
మఱియెఱిఁగియెఱుఁగనొల్లని, కఱటిందెలుపంగఁగమల గర్భునివశమే. 21

గీ. మీనువలతన్నుఁబొందుట గానకిష్ట, వృత్తివిహరించుచుండెడు విధమకాదె
యెల్లిచేసెదననక మేలిపుడుచేయు, మనఘయోర్చునెమ్మృత్యువు మనుజాపనులు.

క. ఆర్యులుదఱితోఁదగియెదు, కార్యమనుష్ఠింతురట్లు గాకప్పనిమా
త్సర్యమునఁదగిచిపట్టియు, నార్యులుదుదిదూఱవగతు రాపదయైనన్. 23

క. ధీరుఁడుశూరుఁడు జడుఁడువి, శారదుఁడుబలాత్మకుండు సబలుండనలే
దేరినైనమృత్యువు దు,ర్వారంబై యపహరించు వైదికవర్యా. 24

క. బెడిదముగఁ గత్తిఁ గొడ్డలి, పొడువఁ దెగిన మ్రానఁ జిగురు పొడము పలుకులన్
జెడదు నిసిన కార్యంబుని, గుడనేరఁడు పిదప నెట్టు గురువంశనిధీ. 25



